# రాష్ట్ర వార్తలు

### కొవ్వూరు

శ్రీ కొవ్వూరు మెహర్ సెంటరువారి ఆహ్వానాన కొవ్వూరుబోర్డు హైస్కూలు భవనమందు శ్రీ పశ్చిమ గోదావరిజిల్లా జడ్జీగారైన శ్రీ కె. వి. కృష్ణారావు నాయుడుగారి అధ్యక్షతను ఈనెల 13వ తేదీన బహిరంగసభ జరిగినది.

సభ శ్రీ బాలభాస్కరరాజుగారి ప్రార్థనలతో ప్రారంభింపబడెను. తెలుగు స్వతంత్ర కొథ్యక్షులైన శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారికి వారికి సద్గురు మెహర్ బాబావారి దర్శన భాగ్యము ఎలా లభించినదీ తదాది తమ జీవితము లో వచ్చిన మార్పును గురించి ప్రస్తావించారు. ఆ మార్పు కారణంగానే రాజకీయ రంగమునుంచి విరమించినా నని చెప్పారు. శ్రీ బాబా వారు రాబోయే ఫిబ్రవరిలో ఆంధ్రదేశము రానున్నారని తెలియజేశారు. శ్రీ బాల భాస్కరరాజుగారు వారు రచించిన కీర్తనలు పాడి వినిపించారు. శ్రీ పాల కొడేటి రామలింగేశ్వరరావుగారు శ్రీ మెహర్ బాబాగారివద్దనుంచి సభ కు పూర్వము వచ్చిన జాబులయందలి విశేష ములను తెలియజేశారు.

### మార్టేరు

ఈనెల 17 తేదీ రాత్రి కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యమున జరిగిన సభలో గారపాటి సత్యనారాయణగారు రాజధాని సమస్యనుగూర్చి మాట్లాడుతూ కృషికార్ లోక్ పార్టీ తెలుగుప్రజల విశాఖపట్టణం సవరణ నెగ్గినదని కర్నూలు తాత్కాలిక రాజధానిగా నిలిచినదని చెప్పారు.

గవర్నరు ప్రసంగంపై సవరణ తీర్మానం నెగ్గిన అసెంబ్లీ రద్దు చేస్తారని చాలమంది ఎం. ఎల్. ఏ. లు భయపడుటవలన అవిశ్వాస తీర్మానం చర్చకు ఒక రోజు ప్రభుత్వం కేటాయిస్తానని చెప్పడంవల్ల కమ్యూనిస్టుపార్టీ అవిశ్వాస తీర్మానానికి ఒప్పుకున్నదని అన్నారు. ఈ మూరు శాసనసభలో రాజధాని గురించి చర్చ వచ్చినపుడు, విజయవాడ - గుంటూరు ప్రాంతానికి ఓటు చేయవలసినదిగా ప్రజలంతా శాసన సభ్యులపై ఒత్తిడి తీసుకు రావాలని విజ్ఞప్తి చేశారు.

పిమ్మట ప్రకాశం, సంజీవరెడ్డిగార్లను విమర్శించుచూ ఛాయా చిత్రము ప్రదర్శించారు.

### చెరుకుపల్లి

స్థానిక శేషాద్రి సీనియర్ బేసిక్ పాఠశాలలో, పాఠశాల కమిటీవారు యీ గ్రామస్థుడు, వాస్తువిజ్ఞానశాస్త్రజ్ఞుడున్ను శ్రీ సుగ్రంకోటి సుందరరావుగారికి 116/-లు, పట్టువస్త్రములు బహూకరించి సత్కరించారు. కమిటీ అధ్యక్షుడు గుగ్గిలం లింగయ్యగారిచే వారికి యీ బహుమానములు సమర్పింపబడినవి.

ఈ ఫిర్కా పంచాయతీబోర్డుఅధ్యక్షులు 11 మంది సమావేశమై యీ గ్రామంలో ఒక క్లబ్బు స్థాపించుటకు నిశ్చయించారు.

### పావట్లి

వి. యల్. సుందరరావుగారి అధ్యక్షతను పట్టణ ప్రజాసోషలిస్టు ప్రాథమిక సభ్యులు సమావేశమై యీ దిగువ కమిటీని ఎన్నుకున్నారు.

కార్యదర్శి: యమ్. బి. శర్మగారు, సభ్యులు: వి. యల్. సుందరరావు, అబ్దుల్ రజాక్, కుమ్మడి సాంబయ్య, శ్రీ రాఘవయ్య, కొటి మోజెస్, మహమ్మద్ ఖాన్ మొదలగు 15 మందిని ఎన్నుకున్నారు. తదుపరి తొమ్మిది మందిని నియోజకవర్గ సభ్యులుగా ఎన్నుకున్నారు.

### మోగల్లు

ఈ గ్రామ (మోగల్లు) కాంగ్రెస్ ప్రాథమిక సభ్యులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారి అధ్యక్షతన సమావేశమై యీ దిగువ కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు.

అధ్యక్షులు శ్రీ ఉంతేన సత్యనారాయణరాజు, కార్యదర్శి శ్రీ కలిదిండి వెంకటపతి రాజు.

మిగతా సభ్యులు శ్రీ యుతులు అల్లూరి సత్యనారాయణ రాజు, పిన్నంరాజు తాతరాజు, చేబ్రోలు సుబ్బారావు, వడింపల్లి సుబ్బరాజు, పెన్మెత్స సుబ్బన్నగార్లు.

### ఆచంట

ఈ పట్టణ కాంగ్రెసు సభ్యులు నెక్కంటి రామారావుగారి అధ్యక్షతను సమావేశమై నూతన సం॥నకు శ్రీ గొడవర్తి సత్యనారాయణగారిని అధ్యక్షులుగను, తాలూరి గాంధీగార్ని ఉపాధ్యక్షులుగను, చేకూరి పుల్లారావు గారిని కార్యదర్శిగను, చిల్లూకూరి గోపాలంగార్ని సహాయ కార్యదర్శిగను, గొడవర్తి శేషరావుగారిని కోశాధిపతిగను, శ్రీ గొడవర్తి వెంకటనారాయణం, గొడవర్తి ఆదినారాయణ, పువ్వుల సూర్యనారాయణ, తమ్మినీడి పట్టాభి శితారామయ్య, నెక్కంటి వెంకటనారాయణ, మొవర్తి సుబ్బారావు, తోలేటి చినముత్యం, నెక్కంటి వెంకటరావు, పెమ్మరాజు నాగభూషణంగార్లను సభ్యులుగను కార్యవర్గముగాయెన్నుకొన్నారు.

### భాజీపాలెం

పరస్వతీ నిలయగ్రంథాలయ భవనముపై అధ్యక్షులగు మంతేన వెంకటనరసరాజుగారి ప్రోత్సాహమున నూతనముగా వేయబడిన అంతస్థును యీనెల 17వ తేదీన జిల్లా పంచాయతీ ఆఫీసరుగారైన పి. రాజారావుగారిచే పంచాయతీ కార్యాలయ ప్రారంభోత్సవం జరుపబడెను మహాత్మాగాంధి, పొట్టి శ్రీరాములుగార్ల ఛాయాచిత్రములను సభాధ్యక్షులును, క్షత్రియాబోర్డు హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు శ్రీ చీరాల శ్రీరాములుగారు ఆవిష్కరించారు. సభా ప్రారంభకులు శ్రీ రంగావఝుల శేషగిరిరావుగారు సభ ప్రాశస్త్యమును గురించి మాట్లాడారు ఓదప నారాయణం చక్రవర్తిగారి అభివందనములతో సభ ముగిసెను.

### సత్తెనపల్లి

సత్తెనపల్లి తాలూకాలోని నాట్య కళాకారులందరు గత 16వ తేదీ శ్రీ పులహారి లక్ష్మీబాయిగారి అధ్యక్షత క్రింద సమావేశమై ఇచట గల ప్రగతి నాట్యకళామండలి అధ్వర్యం క్రింద తాలూకాలోని అన్ని కళాసంస్థలను ఏకంచేసి దానినే విస్తృత పరిచేందుకు తీర్మానించుకొనుటయే గాక మండలియొక్క శాఖలను ముమ్మరముగా బలపరిచి ప్రతిమాసం యువకులకు సాహిత్యపోటీలు జరిపి బహుమతులిచ్చుటకు గూడ నిర్ణయించుకొని ఈ శాఖయొక్క కార్యనిర్వహణ భారమంతయు శ్రీ మూయూరి రామలింగారెడ్డిగారు ఆమోదించి ఏర్పాటు చేసికొన్నారు.

ఆంధ్ర స్వపరిపాలనశాఖమంత్రి పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిగారు ఇటీవల పుత్తూరులో ఆంధ్రకళాపరిషత్తును ప్రారంభోత్సవం జరిపారు.

పుత్తూరులో మంత్రి తిమ్మారెడ్డిగారు స్థానిక ఉన్నతపాఠశాలను సందర్శించినప్పుడు ఉపాధ్యాయవర్గమూ, పురప్రముఖులూ ఆయనను ఘనంగా ఆదరించారు.

# కొరియా ఖైదీలకు హితబోధ చేసే గడువు

## పొడిగింపుకు మిత్రరాజ్యాల నిరాకరణ:

న్యూఢిల్లీ, డిసెంబర్ 21: స్వదేశాలకుపోవ నిరాకరించే కొరియాయుద్ధ ఖైదీలకు స్వపక్షాలు నచ్చచెప్పటానికి ఇవ్వబడ్డగడువు డిసెంబర్ 23వ తేదితో పూర్తవుతుంది. దీనిని పొడిగించాలని కమ్యూనిస్టు ప్రతినిధులు చేసిన ప్రతిపాదనను పాన్ముంజాన్ లో యుద్ధవిరమణ పర్యవేక్షణసంఘంలో కొరియా మిత్రరాజ్య ప్రతినిధులు నిరాకరించారు. తరవాత 30 రోజులకు, అనగా జనవరి 22వ స్వదేశాలకి పోని ఖైదీలందరినీ విడుదలచేయవలసివున్నది.

కొరియాసమస్యపై చర్చించేనిమిత్తం సమితి ప్రత్యేకసమావేశాన్ని జనవరి 15వ తేదీన సమితి అధ్యక్షురాలు శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ఏర్పాటుచేస్తుందని ఇక్కడి భారత విదేశాంగ కార్యాలయ సన్నిహిత వర్గాలు తెలుపుతున్నట్లు యు. పి. ఐ. విలేఖరి తెలియజేస్తున్నాడు. ఇందుకోసం ఆమె జనవరి మొదటివారంలో న్యూయార్కు వెళుతుందట. (అయితే సమితి సభ్యుల్లో అధిక సంఖ్యాకులు సమావేశం జరపటానికి ఆమోదిస్తేనే అది సాధ్యపడుతుంది.)

సమితిలో భారతప్రతినిధివర్గ నాయకుడు కృష్ణమీనన్ నేడు ప్రధాని నెహ్రూను కలుసుకుని తాను లండన్ లో బ్రిటిష్ విదేశాంగమంత్రితో జరిపిన సంభాషణలనుగురించి తెలియజేశారు.

ఈవేళ పాన్ముంజాన్ లో స్వదేశానికిరాని ఖైదీలనుగురించి, నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తున్న కమ్యూనిస్టులు చెప్పుకోతగ్గ ఫలితాన్ని సాధించారు. వారు 250 మంది ఖైదీలకు నచ్చచెప్పగా అందులో 35 మంది మనసుమార్చుకొని కమ్యూనిస్టుపక్షానికి వెళ్ళిపోయినారు. మనసుమార్చుకోనివాళ్లకూడా, కమ్యూనిస్టులు కోరినట్టుగా, నచ్చచెప్పించుకొని వాళ్లనుంచి తిమను విడదీయటానికి అంగీకరించారు. కమ్యూనిస్టులు రేపు మరి 250 మందిని నచ్చచెపుతారు.

మిత్రప్రతినిధులుకూడా స్వదేశాలకురాని అమెరికన్, దక్షిణకొరియన్ ఖైదీలకు రేపు నచ్చచెపుతా'మని చెప్పి ఉన్నారు.

# లంక కమ్యూనిస్టులకు రష్యా ధన సహాయం?

## సింహళ ప్రధాని ఆరోపణ

కొలంబో, డిసెంబరు 21: ఇటీవల సింహళ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శికి రష్యానుంచి చాలా పెద్ద మొత్తంలో డబ్బును స్విట్జర్లాండ్ ద్వారా పంపటం జరిగిందని సింహళ ప్రధాని కొత్తెలావాల నిన్న ఆరోపించినట్లు సింహళ పత్రిక డెయిలీ న్యూస్ నేడు ప్రకటించింది.

కొలూతొరా అనే పట్నంలో మాట్లాడుతూ ఆయన ఈ ఆరోపణ చేశారట. తమకు అధికారం లేకపోయినప్పటికీ, ఆ విషయమై ఇతర వివరాలు తెలిసికొనడూ సాధ్యం కాలేదని బ్యాంకువారికి తాను ఉత్తరువు చేసినట్లు ఆయన తెలియజేశారు.

ఈయన ఆరోపణ వార్త వెలువడ్డ వెంటనే కమ్యూనిస్టు నాయకుడు డా॥ ఎన్. ఎ. విక్రమసింఘె ఒక ప్రకటనలో తమకు రష్యానుండిడబ్బు వచ్చినట్లు అతి చిన్న నిదర్శనాన్నయినా చూపవలసిందని ప్రధానిని సవాలు చేశారు.

# తమిళ పత్రిక శీర్షిక

## సంపాదకీయంలో విచారం

## ప్రకటన: అసెంబ్లీలో ప్రసక్తి

మదరాసు, డిశంబరు 22: మదరాసు అసెంబ్లీ ఈ ఉదయం స్పీకరు శ్రీ జె. శివషణ్ముగంపిళ్లెగారి అధ్యక్షతను సమావేశమైంది ప్రశ్నోత్తరాల అనంతరం, అసెంబ్లీ సభ్యులైన శ్రీ కె. టి. కోసలాంగారు 'దినమణి' పత్రిక శ్రీ రాజాజీప్రభుత్వాన్ని విమర్శిస్తూ యిటీవల సభలో చెప్పిన ఉపన్యాసమునకు సభాగౌరవమునకు అమర్యాదకరమైన శీర్షికనిచ్చి పత్రికలో ప్రచురణ చేయడం సభవారి హక్కులకు భంగకరమైన విషయమని శ్రీ కోసలాం, శ్రీ అర్. వి. స్వామినాథన్ గార్లు తెలిపిన ఆక్షేపణప్రసక్తి యీ వేళ అసెంబ్లీలో వచ్చింది.

దినమణిపత్రిక యీ విషయమై ఉపసంపాదకీయములో ఆ ప్రచురణకు కారణమైన సందర్భములను తెలిపి అందుకు విచారం తెలిపియున్నట్లు స్పీకరు సభలో ఆ సంపాదకీయ వ్యాసాన్ని చదివి తెలిపారు.

తమిళములోగల ఆ వ్యాసం మళయాళంసభ్యులకు అర్థం కానందున తర్జుమా చేయించడం అవసరమనీఅపుడే దానిలోని అర్థం తెలిసికొని చర్చలో పాల్గొనటానికి తమకు వీలు కాగలదని డా॥ మీనన్ గారు కోరారు.

మళయాళంలో తర్జుమా చేయటానికి వీలుగాని, సౌకర్యంగాని లేదని స్పీకరు తెలియజేశారు.

శ్రీ కోసలాంగారు కొన్ని పత్రికలు ప్రభుత్వంయెడ పక్షపాతం వహించి శ్రీ రాజాజీని దూషించిన వారి ప్రసంగాలను తమకు అనుకూలమైన విధములలో యిష్టానుసారం ప్రచురించుకొంటూ సత్యాన్ని మరుగుపరుస్తున్నవని యీ సభవారి హక్కుల విషయంలో ఆ పత్రిక వైఖరినిగూర్చి కొంత మందలించి యీవా తీరాలని కోరారు,

స్పీకరు ఆ పత్రిక యీ విషయమై విచారం తెలిపియున్నందున మరే చర్యతీసుకోడం అనవసరమని రూలింగు యిచ్చారు.

సభవారు నిన్న భూమిశిస్తు డిమాండును ఆమోదించినారు. ఈ రోజు న అమ్మకొలపన్ను డిమాండుపై చర్చ సాగుతున్నది.

# కళలను ఆదరించి పోషించవలసిన బాధ్యత ప్రభుత్వానిదే

## మ్యూజిక్ అకాడమీ వార్షికసభకు ప్రారంభోత్సవంజరుపుతూ కేంద్రమంత్రికేస్కర్ ఉద్ఘాటన

మద్రాసు, డిశంబరు 23: "సంగీత కళను ఆదరించి, ప్రోత్సహించడం ఈ ప్రజాస్వామ్య యుగంలో రాజులను, రాజాస్థానాలను రద్దుచేసినప్రజా ప్రభుత్వానిదే. అది వారి విధ్యుక్త ధర్మము" అని భారత ప్రభుత్వ ప్రచారశాఖా మంత్రి డా॥ బి. వి. కేస్కర్ గారు నిన్న సాయంత్రం మైలాపూరు రసికరంజనిసభ హాలులో మద్రాసు సంగీతపరిషత్తు 27వ వార్షికోత్సవాన్ని ప్రారంభిస్తూ చెప్పారు. విద్వాన్ తిరుపరంబం ఎస్. స్వామినాథపిళ్లెగారు అధ్యక్షత వహించారు. పరిషత్ పక్షాన సంగీతకళానిధి టి. వి. సుబ్బారావుగారు డా॥ కేస్కరకు సన్మానపత్రాన్ని సమర్పించారు.

డా॥ కేస్కర్ గారు ఇల్లా చెప్పారు:- "నేను పెద సంగీత విద్వాంసుణ్ణికాను, ఏ కళాభివృద్ధికి యథాశక్తిని పాటుపడవలెనని కళాభిమానిని. 1927 నుంచీ ఈ సంగీత పరిషత్తు సంగీతకళా వ్యాప్తికి ప్రశంసనీయమైన కృషి చేస్తోంది. ఇట్టి సంస్థ ఉత్తరాదిన కూడా ఉంటే ఎంత బాగుండేది."

"ఉత్తరాదినైనా, దక్షిణాదినైనా సంగీతకళకు మూలకారణం ఒక్కటే. స్వరములు, శృతులు, రాగములు ఏక మే. అయితే ఉత్తరాదిన పరాయివారిదండయాత్రలవల్ల తురకరాజుల పరిపాలన వల అచ్చటి సంప్రదాయ సిద్ధమైన సంగీతము భ్రష్టమై, ప్రమాణములు పతనమైనవి. దక్షిణాదినమటుకు రాజకీయములైన మార్పులతో నిమిత్తం లేకుండా సంగీత సంప్రదాయములు అవిచ్ఛిన్నముగా కొనసాగుట సంతోషకరము."

"పూర్వకాలమున ప్రతికుటుంబము సంగీతమున్న ఆత్మాసక్తి చూపుచుండేవారు. తిర్వాత ఈకళ ఆశ్రయము కల్పించిన రాజాస్థానము ప్రవేశించినది. అదే దాని కొటపట్టులైనది. త్యాగరాజాది వాగ్గేయకారకులు భక్తిగానముచే నాదబ్రహ్మానుసంధానము గావించి సంగీతకళా మాహాత్మ్యమును జగత్తుకు చాటేవారు. భక్తిపూరితమైన ఆధ్యాత్మిక ప్రబోధకమైన సంగీతము అవసరము. సులభమైన పాటలు గ్రామీణులకు సులభముగా గ్రాహ్యముకుటకు అవసరము. ఆత్మప్రబోధము, ఆధ్యాత్మిక చింతనాయుతమగు కీర్తనలు, సంగీతము వృద్ధిగాక తప్పదు. సంప్రదాయపు సంగీతమునకు సులభసంగీతమునకు వైరుధ్యము లేదు. ఆయా వ్యక్తుల యోగ్యతార్హతల ననుసరించి ఆయా సంగీతములను విని ఆనందించగలరు. సర్వజన సులభమైనసంగీతమును అందిచ్చవలెనని రష్యావంటి దేశములలో గూడా ఉత్తమ సంప్రదాయములు నిలబెట్టి వాటిని చూచి గర్వించుచుందురు. మనదేశ సత్సంప్రదాయమునకు సంప్రదాయ సంగీతము మనటాయమానమని గుర్తించి దాని వ్యాప్తికి కృషి చేయవలెను.

"విద్యావ్యాసంగముగల ప్రతి కుటుంబమును సంగీతములో ప్రమేయము ఉండదగును. అప్పుడే దేశ సంస్కృతిలో సంగీతము వాస్తవమైన స్థానమును పొందగలదు."

"రాజస్థానముల స్థానమును రేడియో చాలవరకు ఆక్రమించి సంగీత కళావేత్తల అభిమానింప గల్గినది. అయితే ఈ సాంస్కృతిక ప్రపత్తి బాగా గుర్తింపబడలేదు. సంగీత కళాభివృద్ధికి రేడియోదోహదము చేయవలసియున్నది సంగీతము ఏ కొద్దిమంది వ్యక్తులకో గాక సంస్కృతిపరులైనవారందరికీ ఆనందకారకమై, ఉత్తేజము నివ్వవలసి ఉండును."

### అధ్యక్ష ప్రసంగం

అధ్యక్షులు తమ ప్రసంగంలో ఇల్లా చెప్పారు: "సంస్కృతి, సంగీతము, కళలు తమిళదేశపు కొణాచి. తమిళదేశమునుంచే ప్రపంచంలోని నలు మూలలకు ఈ కళ పాకినది. త్యాగరాజు, ముత్తుస్వామి, దీక్షితులు, శ్యామాశాస్త్రి ఈ త్రిమూర్తులవల్ల దక్షిణదేశమున ఈ కళ ఉత్తమ శిఖరముల నందుకొన్నది. సత్సంప్రదాయముల రక్షించుట సంగీతవేత్త లందరి ధర్మము. వేణుబోధనకు పాఠశాలలో తగిన స్థానమివ్వవలెను, పాఠశాలల్లో పట్టములనుసరించిగాక ప్రతిభననుసరించి సంగీతకళా బోధనకు అధ్యాపకుల నియమించవలెనని కోరుచున్నాను."

టి. ఎల్. వెంకట్రామయ్యగారి వందనముల తర్వాత అధ్యక్షుని వేణుగానముతో సభ ముగిసెను.

ఆంధ్ర సంగీత విద్వాంసులు శ్రీ నేదునూరి కృష్ణమూర్తి (పిఠాపురం) శ్రీ ద్వారం నరసింగరావు (విజయనగరం) శ్రీ కోలంక వెంకటరాజు (తుని) గార్లు ఆహ్వానింపబడి సన్మానింపబడిరి. శ్రీ అల్లంరాజు సోమరాజు శర్మగారి కుమారులు శ్రీ వెంకట సుబ్బారావు, శ్రీ వెంకట నారాయణరావుగార్లు సంగీత విద్వాంసులకు స్వస్తిపలూ తిలాటకంకణములను బహూకరించారు. సభకు ఆహ్వానితులైన పండితులు కవులు యీ సందర్భమున వారు రచించిన పద్యములను సభారంజకముగ చదివి వినిపించారు. సభానంతరము సంగీత కచ్చేరీ జరిగెను. శ్రీ నేదునూరి కృష్ణమూర్తిగారు గాత్రం, శ్రీ ద్వారం నరసింగరావుగారి వయొలిన్ శ్రీ కోలంక వెంకటరాజుగారి మృదంగం సభికుల నందరిను రంజింపజేసి వారి మన్ననలను చూరగొనిరి.

### తెనాలి మున్సిపల్ కౌన్సిల్

తెనాలి, డిశంబరు 19: స్థానిక పురపాలక సంఘంవారు మొన్న సాయంకాలం చైర్మన్ శ్రీ నన్నపనేని వెంకట్రావుగారి అధ్యక్షతన అవసరంగా సమావేశమై, రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశం పంతులుగారు డిసెంబరు 22న యిక్కడికి వచ్చినపుడు వారికి స్వాగతపత్రం సమర్పించుటకు జనవరిలో యిక్కడికి వచ్చే రాష్ట్ర గవర్నరు శ్రీ త్రివేది గారికి స్వాగతపత్రం సమర్పించేందుకు తీర్మానించారు.

### కాంగ్రెసు సభ్యులను చేర్పుటకు గడువు పొడిగింపు

విజయవాడ, డిసెంబరు 18: ప్రదేశ్ కాంగ్రెసు సమాచారవుద్యోగి శ్రీ వేదాంతం చిదంబరశాస్త్రిగారు యిలా ప్రకటిస్తున్నారు:

"ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా 1953 సం॥ లో కాంగ్రెసు సభ్యులను చేర్పించుటకు 1954 సం॥ ఫిబ్రవరి 28 వరకు గడువును పొడిగించుటకు కాంగ్రెసుకార్యవర్గం అంగీకరించింది. అందుచే వచ్చే సం॥ కూడ సభ్యులు తమ సభ్యత్వం తిరిగి కొనసాగించుటకు జూన్ 30 నుంచి ఆగస్టు 31 వరకు గడువు పొడిగించబడెనని అలాగా సభ్యత్వం పునరుద్ధరించుకొనువారు 1954 లో జరుగు కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొనగలరు. ఇకముందు పొడిగింపు జరగదు. కనుక జిల్లా, తాలూకా, పట్టణ కాంగ్రెసు సంఘాలవారు ప్రత్యేక కృషి చేసి గత సం॥ కన్న యీయేడు సంఖ్య పెరుగులాగున చూడాలి - ప్రైమరీ సభ్యత్వం, ఉత్సాహంగా పని చేయువారి సభ్యత్వం, (1953 సం॥ వరకు) ఫిబ్రవరి ఆఖరులోగా పూర్తిచేయించాలి."

# రష్యా-ఇండోనీషియా రాయబార సంబంధాలు

## ఇండోనీషియా సమ్మతి

జకర్తా, డిసెంబరు 21: రష్యాతో పరస్పరం రాయబార సంబంధాలను ఏర్పరచుకునేందుకు ఇండోనీషియా అంగీకరించిందని ఇండోనీషియా విదేశాంగ కార్యాలయం నేడిక్కడ ప్రకటించింది. వీలయినంత త్వరలో ఇండోనీషియా రాయబారిని మాస్కో పంపటానికి రష్యా అంగీకరిస్తూ, జకర్తాలో తన రాయబారిని నియమించటానికి సమ్మతి తెలియజేసింది.

ప్రస్తుతం లండన్ లో ఇండోనీషియా రాయబారిగా ఉన్న డా॥ సుబాంద్రియోను మాస్కోలో తొలి రాయబారిగా నియమిస్తారని తెలుస్తున్నది.

### ఇండో-చైనా వ్యవహారాల పరిశీలన

ఇండో - చైనాలోని యథార్థపరిస్థితులను తెలుసుకునే నిమిత్తం ఫ్రెంచి ఆక్రమిత ప్రాంతాలకూ, వియట్మిన్ ఆక్రమిత ప్రాంతాలకూ కూడా పరిశీలన బృందాలను పంపించటానికి ఇండోనీషియా ఆలోచిస్తున్నట్లు అంతరా వార్తా సంస్థ వెల్లడించింది.

డచ్చివారి రెండవ దండయాత్ర పంచమ వార్షికోత్సవాన్నీ, కీట్నాం ప్రజా స్వాతంత్ర్య పోరాట సప్తమ వార్షికోత్సవదినాన్నీ కలిపి నిన్న జకర్తాలో అంతర్జాతీయ సమైక్యతాదినం జరపబడ్డది. ఇండోనీషియా కార్మిక మంత్రి డా॥ అబిదీన్ అందులో మాట్లాడుతూ, ఇండో - చైనా ప్రజలు వలస సామ్రాజ్య వాదంమీద సాగిస్తున్న పోరాటాన్ని ఇండోనీషియా ప్రభుత్వం సమర్థిస్తున్నదని ఉద్ఘాటించారు.

### చైనాకు రబ్బరు ఎగుమతులు

కమ్యూనిస్టు చైనాకు రబ్బరును ఎగుమతి విషయమై ఇండోనీషియా మంత్రివర్గం పరిశీలించబోతున్నదని మంత్రివర్గ సభ్యుడు నాసిర్ రాన్ నేడిక్కడ వెల్లడించారు. చైనా - ఇండోనీషియాలు ఇటీవల చేసుకున్న ఒప్పందాన్ని ఉభయ ప్రభుత్వాలూ ధృవపరచవలసివున్నది.

# ఆంధ్ర ప్రభుత్వ మొహరు

## చిత్రకారునికిరు501బహూకరణ

కర్నూలు, డిశంబరు 22: ఆంధ్ర ప్రభుత్వం ఆమోదించిన ప్రభుత్వ మొహరు నమూనాను తయారు చేసిన చిత్రకారుడు శ్రీ నూకశెట్టి అంజనేయులు గారికి ప్రభుత్వం (అయిదు వందల ఒకటి) 501 రూపాయల రొక్కం బహూకరించింది. (పి.టి.ఐ.)

# కెన్యాలో ఆఫ్రికన్లపై బ్రిటిష్ 'హత్యాకాండ'

## —ఫెన్నర్ బ్రాక్వే సాక్ష్య సేకరణ

లండన్, డిసెంబరు 21: కెన్యాలో మావ్ మావ్ పేరుపెట్టి ఆఫ్రికన్లను తెగచంపేందుకు బ్రిటిష్ సైన్యం బహుమతులు పంచిపెట్టేమాట నిజమేనని ఆ సైన్యం తాలూకు "మేగజైన్"లలోని వార్తలను, సమాచారాలను ఉటంకించి ఉపపత్తులను చూపిస్తూ లేబర్ "డెయిలీ హెరాల్డు", "డెయిలీ మిర్రర్" పత్రికలు నేడు వార్తలను ప్రకటించాయి.

ఈ ఆరోపణలు ఆదిలో గ్రిఫిత్స్ అనే బ్రిటిషు సైనికోద్యోగిని కోర్టుమార్షల్ పై విచారిస్తున్నప్పుడు బయటపడ్డాయి. తర్వాత చర్చిల్ ప్రభుత్వం ప్రజాభిప్రాయంయొక్క ఒత్తిడికి లొంగి విచారణసంఘాన్ని నియమించింది.

ఇప్పుడు ఈ బ్రిటిషుసైన్యం తాలూకు మేగజైన్ లో ఈ సైన్యం తాలూకు సైనికులు ఎట్లా ఆఫ్రికన్లను చంపింది ఎంతమందిని చంపింది వివరాలు ఇచ్చింది. బహుమానాలను గురించికూడా వ్రాసింది. ఫెన్నర్ బ్రాక్వే ఈ సమాచారాన్నంతా ఉదహరిస్తూ బ్రిటిషు యుద్ధమంత్రికి పంపిస్తున్నారు.

### ఆఫ్రికన్లకు మరణశిక్ష

లారీ హత్యాకాండను గూర్చిన విచారణలో 18 మంది ఆఫ్రికన్లకు కెన్యా సుప్రీంకోర్టు మరణశిక్ష విధించింది. ఈ కేసులో ఇంతవరకు, వీరి నిగాక, 43 మందిని కెన్యా ప్రభుత్వం ఉరితీసింది.

### కొరడాతో కొట్టిన తెల్లవానికిశిక్ష

ఆఫ్రికన్లను పట్టుకొని అనవసరంగా కిరోమ్మగం చర్మంతో కేవిన కొరడాతో వారిని కొట్టినందుకుగాను కెన్యావాలీసు రిజర్వులో పనిచేస్తున్న ఒక ఇంగ్లీషు ఉద్యోగికి కోర్టువారు పదిహేను వందల జరిమానా విధించారు. ఈయన తాను చేసిన తప్పును ఒప్పుకున్నాడు.

### సంగీతవిద్వాంసులకు సన్మానం

కొత్తపల్లి, డిసెంబరు 18: పిఠాపురం తాలూకా కొత్తపల్లి గ్రామములో లక్ష్మీగణపతి ఆయుర్వేద నిలయమున శ్రీధన్వంతరిజయంతి సందర్భమున వైద్యరాజ శ్రీ పాలంకి సూర్యనారాయణ కవి గారి అధ్యక్ష్యమున గొప్పసభ జరుపబడెను. ప్రఖ్యాత

